# వి ష య సూ చి క

## అ ను బం ధ ము :

[ రుద్రాభిషేక నిర్వహణ సమయాన విఘ్నేశ్వర పూజ తరువాత మహాన్యాసమునుగాని లఘున్యాసమునుగాని అనుష్ఠింపవలసి యున్నది. నిర్వాహకులు వీలునుబట్టి ఏదైన అనుష్ఠించుటకు వీలు కలుగునట్లుగా మహాన్యాసమును, లఘున్యాసమును వరుసగా ప్రత్యేకముగా నిచ్చుచున్నాము. ]

# మన పూజల పరమార్థము

దైవమును ఆరాధించుట ఎందులకు? దైవముగా జీవించు నందులకు, దైవమనగానేమి? మన యొక్క నిజస్వరూపము.

మన యొక్క నిజస్వరూపమే దైవ మైనప్పుడు మరి ఆరా ధించుట యెందులకు? మనమా నిజస్వరూపముగా నిలబడి వర్తించ గలందులకు. మన నుండి వ్యక్తమైన దేహము దేహముగా వర్ధిల్లుటకు గాను మనము కొన్నిచర్యలు చేపట్టుచున్నాముకదా! దానికి మొహము కడుగుచున్నాము. స్నానము చేయించుచున్నాము, అభ్యంగనస్నా నము కూడా చేయించుచున్నాము. కావలసిన అన్నపానములన్నియు అందించుచున్నాము. అది బాగుండుటకు కావలసిన సదాచారమును కూడ కోరి అభ్యసించుచున్నాము. అట్లే మనయందు ఇంద్రియములున్నవి. వాటిని నడుపుమనస్సు ఉన్నది. వాటిపైన బుద్ధి ఉన్నది. ఇవన్నియూ కూడ ఎప్పటికప్పుడు పరిశుద్ధముగ ఉండవలెనన్నచో కొన్నిచర్యలను పూని చేపట్టవలెనని గ్రహించి మన పెద్దలు వానిని దర్శించి మనకు అందించినారు. ఈ చర్యలే వివిధములైన ఆరాధన వైఖరులు. దేహము, ఇంద్రియములు, మనస్సు బుద్ధి ఎప్పటికప్పుడు పరిశుద్ధమగుచు మన యందు మనస్వరూపమై వెలుగుచు వర్తించుటకు, వర్ధిల్లుటకు ఈ ఆరాధనలు చక్కటి ఉపకరణములు. మనము మనముగ జీవింప వలెను. మన మెందుకు దిగివచ్చితిమో అందు కొరకు జీవింపవలెను. మన యొక్క నిజస్వరూపము నిరంతరము మనచే అనుభవింపబడు చుండగా మన జన్మ కర్మలు దివ్యములై లోక హితమును సాధించు చుండవలెను. ఇదీ సకల ఆరాధనలకు పరమార్థము.

'కొందరకు దైవమనువాడు ఒకడున్నాడా? అని అనుమానము, ఇది మన ఉనికిని మనమే అనుమానించుట కాగలదు! మనమున్నా మని అనుటలో మనకు సందేహము లేదుకదా! మన యొక్క నిజ స్వరూపము, సమగ్ర స్వరూపము దైవము అనబడుచున్నదని గ్రహించినప్పుడు ఇక ఇబ్బందులుండవు. ఆ నిజస్వరూపమును, సమగ్రరూపమును నిత్య జీవితమున అనుభవించుటకే ఈ ఆరాధన పై ఖరులు రూపొందినవని మనము గ్రహించిన వేళ వీటి యొక్క ఆవశ్యకత మానవుడికి ఎంతగా కలదో మనకు తప్పక బోధపడ గలదు.

దేహమే దేవాలయము. ఇందు జీవుడుగ వ్యక్తమగుచున్న వాడే సనాతనమగు దైవస్వరూపము. అన్న సత్యమును మన పెద్దలు వేనోళ్ళనొక్కి చెప్పినారు. అట్టి ఈ దేహమును దేవాలయముగా నిల బెట్టుకొనుచు జీవి తాను దైవమై కర్తవ్యరూపమున వెలుగొందుటకు కావలిసిన ఆరాధనా పై ఖరులను రూపొందించి మన కందించినారు. అట్టి ఆరాధనా పై ఖరులలోని ముఖ్యాంశములనే ఒకచోట సమకూర్చి గ్రంధరూపము ధరింపజేయగా రూపుకట్టినదే ఈ 'పూజావిధానము - రుద్రాభిషేకము' అను విశిష్ట గ్రంధము.

భారతీయ సంప్రదాయములోని లోతులు తెలియనివారు కొందరు 'ఈ భారతీయులు చెట్టును, పుట్టను గుట్టను గుండ్రాయినికూడ దేవునిగా పూజింతురు. ఇదేమిచిత్రమో!' అనువారు కలరు. ఆ పూజించుటలోని సూక్ష్మమేమో తెలిసిన ఆ అన్నువారు 'అవాక్కు' కాక తప్పదు. చెట్టును దేవునిగా భ్రమించుట కాదది. దైవమే చెట్టుగా కూడ నున్నా డని గ్రహించుట. అట్లే పుట్టగా, గుట్టగా, గుండ్రాయిగాకూడ అతడే

ఉన్నాడు. ఈ సృష్టియందు గోచరించుచున్న వైవిధ్యమంతయూ, అతని వైభవమే సుమా ! అది గ్రహించుటకే ఇట్లు పూజించుట.

ఇక విగ్రహారాధనను నిరసించు వారున్నారు. 'దేవుడు నిరాకారుడుకదా ! అతడి పేరిట ఈ విగ్రహముల గోల ఏమి ? అని విమర్శించువారున్నారు. దేవుడు నిరాకారుడనుట ఎంత నిజమో, ఈ సృష్టియందలి ఈ మూర్తులన్నియు అతని రూపములే అను మాట కూడ అంతే నిజము. ఇన్ని మూర్తులుగా, కనబడుచున్న ఈ అచేతన సచేతన విగ్రహములుగా భాసించుచున్నది అద్వైవమే. ఇట్లు బహురూపకుడై ఈ సృష్టిరూపమున విలసిల్లుచున్న దైవము నారాధించుట ఎట్లో నేర్చుకొనుటకే విగ్రహారాధనమును నిర్వహించుట.

మరి కొందరు 'ఈ భారతీయులకు బోలెడుమంది 'దేవుళ్ళు' న్నారు. అను వారునూ కలరు. భారతీయులలోకూడ కొందరు ఇట్లను కొనుట విచిత్రము. నిజమునకు దేవుడు ఒక్కడే. ఈ 'దేవుళ్ళు' గా పిలువబడుచున్న వారందరు ఆ దేవునియొక్క మూర్తులైన దేవతలు. తల్లి గర్భమున పడినపుడు మన మొక్కరమే ఉన్నాము. జీవిత యాత్రను నిర్వహింపగోరి మనమే దేహముగా, దేహము నందలి వివిధభాగములుగా రూపుధరించుచున్నాము. ఈ సత్యము తెలియక మన దేహము నందలి భాగములను వేరు వేరు వ్యక్తులుగా ఎవరైన భ్రమించినచో ఎట్లుండును ? జీవన యాత్రను నిర్వహింపగోరి మనమెట్లు దేహభాగములను పొందుచున్నామో, సృష్టి కార్యక్రమమును నిర్వహింపగోరి దైవమట్లే దేవతలుగా రూపొందు చున్నాడు, జీవనయాత్ర నిర్వహణమునకు దేహభాగముల రూపకల్ప నము తప్పనిసరి, అట్లె సృష్టి కార్యక్రమ నిర్వహణమునకు దేవతల

రూపకల్పనము తప్పనిసరి. ఆ దైవమే బ్రహ్మగా రూపొంది, ఈసృష్టిని వ్యక్తము చేయుచున్నాడు. విష్ణువుగా రూపొంది ఈ సృష్టి కార్యమును నిర్వహించుచున్నాడు. శివునిగా రూపొంది ఈ సృష్టినంతటిని తన లోనికి స్వీకరించుచున్నాడు. గణపతిగా రూపొంది దేవతాగణములకు ఆధిపత్యము వహించుచున్నాడు. కుమారునిగా రూపొంది ఈ సృష్టికార్య క్రమమునకు కావలసిన ఉత్సాహస్వరూపమై ఉరకలువేయుచున్నాడు. శక్తిగా వ్యక్తమై ఈ సకల సృష్టికి నామ, రూప, పరిమాణ పరిణామ ములను అనుగ్రహించుచున్నాడు ఇట్లెన్నెన్నో మూర్తులుగా వ్యక్త మగుచూ సృష్టికథను నడిపించుచున్నాడు. అతడు దేవుడు. అతడు ధరిం చిన మూర్తులు దేవతలు. మనకూ మన శరీరభాగములకూ ఎట్టి సంబంధ మున్నదో దేవునికీ దేవతలకూ మధ్య అట్టి అనుబంధమే ఉన్నది. కనుక ఈ సూక్ష్మమును తెలిసిన వారు తికమకపడరు 'నర్తకునిభంగి పెక్కుగు మూర్తులతో' నాడుచున్న ఆ దేవుని వైభవమును వారు చూడ గలరు.

ఇక రామకృష్ణాది అవతార మూర్తుల విషయము వ్యక్తమగు చున్న సృష్టియందు ధర్మగ్లాని ఏర్పడినప్పుడెల్ల దిగివచ్చి, ధర్మమును మరల మానవుల హృదయమున సంస్థాపనచేయు దివ్యమూర్తులు వీరు. సృష్టినిలబడుట, వర్ధిల్లుట అనునది విష్ణుమూర్తి యొక్క బాధ్యత కావున అవిష్ణుమూర్తియొక్క వ్యక్తరూపములే ఈ అవతారములు. కనుక దేవతామూర్తులకు అవతార మూర్తులకుగల అనుబంధమును ఈ విధముగా మనము గ్రహింపవలసి ఉన్నది.

సృష్టి అంతయు దైవస్వరూపమే అని మనకు తెలిసినను, అన్ని మూర్తులు ఆయన వ్యక్తరూపములే అని బోధపడినను, మానవులు కొన్ని మూర్తుల రూపమున ఆదైవమును కొలుచుటకు

అలవాటు పడుచుందురు. ఇది సహజము. కనుకనే సర్వమును దైవ ముగా దర్శించి తానట్లు అనుభవించి, తోటివారిని అనుభవింపజేసిన ఆది శంకరులు కూడ మానవుల అభిరుచులను కాదనక వారు ఏయే రూపములలో దైవమును కొలుచుటకు అలవాటు పడినారో బాగుగా గమనించి ఆయా అభిరుచులకు దోహదముచేసి ఉన్నారు. మానవులు కొలుచుచున్న దైవ మూర్తులలో పెద్ద ఎత్తున పూజింపబడుచున్న మూర్తులను పరిగణనములోనికి తీసికొని పంచాయతనమును ఏర్పాటు చేసి యున్నారు. ఆదిత్యుడు, విష్ణువు, శంకరుడు, శక్తి, గణపతి ఈ అయిదుగురు మూర్తులు పంచాయతనమందలి సభ్యులు. వీరి నిట్లు సమీకరించుటయేకాక వీరిపైన దివ్యములైన స్తోత్రములను కూడ రచించి మానవ జాతికి అందించిన ప్రేమస్వరూపులు ఆది శంకరులు.

ఆధునిక కాలమున దేవతామూర్తుల విషయమున ఆవశ్యక మైన సమన్వయమును సాధించిపెట్టినవారు నవయుగ ప్రవక్తలైన కుల పతి ఎక్కిరాల కృష్ణమాచార్య. వివిధములైన ఆరాధనవైఖరులమధ్య వారు సాధించి, అందించిన సమన్వయ స్వరూపమందలి ఒకానొక ప్రధానభాగమే ఈ "పూజావిధానము - రుద్రాభిషేకము" అను దివ్య గ్రంథము.

పూజావిధానము - రుద్రాభిషేకము అను ఈ గ్రంథమునందు మూడు ప్రధానభాగములున్నవి. షోడశోపచారములతో కూడిన పూజా విధానము మొదటిది, విశ్వాగ్ని హోత్ర విధానము రెండవది. రుద్రాభి షేక విధానము మూడవది.

నిత్యము చేసికొనదగినట్టి షోడశోపచార పూజావిధానమున ఆది శంకరుల పంచాయతనము చక్కగా సమన్వయింపబడినది. అనగా ఆదిత్యుడు, విష్ణువు, శంకరుడు, శక్తి, గణపతి ఈ ఐదుగురు మూర్తుల రూపమున విలసిల్లుచున్న ఆ దైవమును అర్చించు కొనుటకు వీలుగ ఈ పూజావిధానము రూపొందింపబడినది. అనగా లోకమున వ్యక్త మగుచున్న ప్రధానమైన ఆరాధనా వైఖరులన్నియూ ఈ పూజావిధాన మున సమన్వయింపబడినవన్నమాట. అట్లే వేదములనుండి పురుష సూక్త, శ్రీసూక్తములు, రామాయణము నుండి ఆదిత్యహృదయము, భారతమునుండి భగవద్గీతా భాగములు భాగవతమునుండి నారాయణ కవచము, ఈ పూజా విధానములోనికి స్వీకరింప బడినవి. అట్లే లక్ష్మీ అష్టోత్తరశతము, కృష్ణ అష్టోత్తరశతము మొదలగుస్తోత్రములుకూడ ఇందుచేరినవి ఆయా సందర్భముల ననుసరించివివిధ వేదమంత్రములు ప్రత్యేకముగ స్వీకరింపబడినవి. ఆదిశంకరుల సౌందర్యలహరినుండి కొన్ని శ్లోకములు ప్రత్యేకముగ ఇందు చేరినవి. చివరకు కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరుని మంగళాశాసనముతో ఈ పూజా విధానము సమాప్తమగుచున్నది. మొత్తము పూజపూర్తి యగుటకు గంట సమయముకూడ పట్టదు. తక్కువ వ్యవధిలో పమగ్రమైనరీతిలో దైవమును అర్చించుకొనుట మనకు సాధ్యమగునట్లుగా చేయుటకే శ్రీ కృష్ణమాచార్య పూజావిధానమునకు ఈ రూపమును సంతరించి పెట్టి వారు. ఇది మన దినచర్యలో ఒకభాగము కావలెనని వారి సం కల్పము. "ప్రేయరు వలన మనలోని అన్ని కోశములు పరిశుద్ధములై దివ్యశక్తి సమన్వితము లగును, పూజావిధానము నిత్యము అనుసరిం

చుటవలన మన జీవితము ప్రణాళికా బద్ధమగును. "ప్రేయరువలన లభించిన దివ్య శక్తి, పూజావిధానము ననుష్ఠించుట వలన మన జీవిత - సన్నివేశములుగా తీర్చిదిద్దబడి సద్వినియోగమగును." అను నది ఈ సందర్భమున వారి సందేశము.

నిత్యాగ్నిహోత్ర విధానమనునది అనాదిగా మనవారు అనుష్ఠించుచు వచ్చుచున్నదే. సృష్టికి ఉన్ముఖుడైన దైవము మొదట అగ్నిగా వ్యక్తమైన మీదట విష్ణువుగా వ్యాపించుచున్నాడని వేదము వర్ణించుచున్నది. ఉష్ణోగ్రత పెరిగినపుడు నీరు నీటి ఆవిరి అగుచున్నది. ఉష్ణోగ్రత తగ్గినపుడు ఆ నీరే మంచుగడ్డగా రూపు దరించుచున్నది. ఈ విధముగా స్థూలమునుండి సూక్ష్మమునకును, సూక్ష్మమునుండి స్థూలమునకును ఈ సృష్టిని నడిపించునట్టి దైవ స్వరూపము ఈ అగ్ని. ఆ అగ్నియే మనయందు త్రేతాగ్నులుగా వ్యక్తమగుచున్నది. ఆకలి రూపమున మనచే అనుభవింపబడుచున్నది వైశ్వానరాగ్ని. సంతతి కొరకు దాంపత్యాభిలాష రూపమున వ్యక్తమగుచున్నది ప్రాజాపత్యాగ్ని. తెలియుట, తెలివితేటలు రూపమున వ్యక్తమగుచున్నది ఆహవనీయాగ్ని. ఈ విధముగా మనయందు నిత్యమూ అగ్నిహోత్రము మూడు రూపముల వ్యక్తమగుచు ప్రజ్వరిల్లుచున్నది. ఈ దేహ మొక యజ్ఞవాటిక కాగా నిత్యాగ్నిహోత్ర స్వరూపమై మన జీవితము వ్యక్తమగుచున్నది. ఇట్లు చూడగలిగినపుడు ఈ సృష్టికూడ అగ్నిహోత్ర స్వరూపమే. కనుక అగ్నిహోత్రమును అర్చించుటవలన సృష్టి తత్త్వము మనకు బోధపడును. మన స్వరూపము మనకు దర్శన

మిచ్చును. ఈ రెండగ్నిహోత్రముల మధ్యన అనుసంధాన మెట్లుండ వలయునో కూడ అనుభవమునకు వచ్చును. కనుకనే పెద్దలు విధి విధానముగ అగ్నిహోత్రమును నిత్యము అర్చించుట అనునది సంప్ర దాయముగ రూపొందించినారు. శ్రీ కృష్ణమాచార్య ఆధునిక కాలమున మానవుని దిన చర్యలో ఒదుగునట్లుగ ఈ అగ్నిహోత్ర విధానమును మార్పుచేసి మరల అందించినారు. పూజావిధానము - అగ్నిహోత్రము కలిసి అటు - ఇటుగా డెబ్బది నిముషములలో పూర్తి కాగలదు. ఇది వార్తాపత్రికలకై మనము ఖర్చుపెట్టుచున్న కాలముకన్న తక్కువే.దివ్య జీవనమునందు అభిరుచిగల మానవుడు ఉదయమే స్నానముచేసి, ఉది కిన వస్త్రములు ధరించి, ఈ పూజావిధానమును నిత్యాగ్ని హోత్రమును పూర్తిచేసికొని దినచర్యలోనికి ప్రవేశించినచో ఆ దినచర్యకూడ దివ్య ముగ, భవ్యముగ సాగిపోగలదు.

రుద్రాభిషేక మనునది కూడ అనాదిగ వచ్చుచున్న సంప్రదాయ విశేషమే. మనస్సు బాగుండక పోయినను స్థితిగతులు బాగుండక పోయినను మనవారు రుద్రుని అభిషేకించి చిత్తశాంతిని పొందు చుందురు. దైవము సృష్టిగా దిగి వచ్చునప్పుడు మూడుస్థితులలో దిగి వచ్చుచున్నాడు. ద్వాదశ ఆదిత్యులుగ,అపైన ఏకాదశరుద్రులుగ అటు పైన అష్టవసువులుగ అతడు దిగివచ్చుచున్నాడు.ఇందు స్పందనాత్మక మైన ప్రవృత్తి కలిగినది రుద్రస్థితి.అస్పందనాత్మకమైన ప్రవృత్తియే ప్రకృతిలోని వివిధాంశములుగ అష్టవసువుల రూపమున రూపు ధరించు చున్నది. ఈ సత్యమును ఎరిగిన పెద్దలు ఈ సృష్టిని రుద్రుని నృత్య ముగా అనగా శివతాండవముగా వర్ణించుచున్నారు. ఇట్లే ఈ రుద్రుడు మనలో ప్రధానమైన పదకొండు స్పందనలుగా వ్యక్తమగుచున్నాడు. ఐదు కర్మేంద్రియములుగ ఐదు జ్ఞానేంద్రియములుగ, వానిని నినియో

గించు మనస్సుగా వ్యక్తమగుచున్నది అతడే. మనస్సు ఇంద్రియముల వైపు మొగ్గినపుడు మనకు ఇంద్రస్థితి అనుభవమునకు వచ్చుచున్నది. మనస్సు బుద్ధివైపునకు మొగ్గినపుడు మనకు అనుభవమునకు వచ్చునట్టి దివ్యస్థితియే రుద్రస్థితి అట్టిరుద్రస్థితి మనకు అనుభవమునకువచ్చుట కొరకే రుద్రాభిషేకము నాచరించుట. అట్టి రుద్రస్థితిలో నిలచిన మానవునికి ఈ జగత్తంతయు ఆ నటరాజు యొక్క నృత్యలీలా విలాసమే. ఈ సత్యమును జగత్తునకు మరొకసారి వెల్లడి చేయుచు శ్రీ కృష్ణమాచార్య రుద్రాభిషేకమునకు ప్రజలను మరల దగ్గర చేసి యున్నారు. అనగా గతానుగతికముగా రుద్రాభిషేకమును చేసికొనుటగా గాక, ఆక్రతువుయెడల మేల్కొంచి అనుభూతి ప్రదముగా దానిని నిర్వహించుకొనునట్లు చేసినారు. మరి మహానీయులు దిగి వచ్చునది జగత్తునకు అట్టి మేల్కొల్పు ననుగ్రహించుటకేకదా! ఇంకనూ కృష్ణమాచార్య స్త్రీ, పురుష భేదముతో నిమిత్తము లేకుండ సర్వులు రుద్రాభిషేకమును చేసికొన వచ్చునని చెప్పి, అట్లు చేయించినారు. ఆబాలగోపాలము కుల, మత భేదముల కతీతముగ స్నానముచేసి, ఉదికిన వస్త్రములు ధరించి సామూహికముగ రుద్రాభిషేకమును నిర్వహించుకొనుట నేర్పినారు. ప్రతి పూర్ణిమకు రుద్రాభిషేకము చేసి కొనుట శివరాత్రివంటి ప్రత్యేక సందర్భములందు ఇరువది నాలుగు గంటలపాటు అఖండముగ రుద్రాభిషేకము నిర్వహించుట ఆ సంద ర్భములందు స్త్రీ, పురుషులు బృందములుగ ఏర్పడి నమక, చమకము లను గొంతెత్తి గానము చేయుట సోదర బృందమునకు అలవాటుచేసి

నారు. వైష్ణవ సంప్రదాయమున జన్మించినవీరు విశాఖలోని వైర్‌లెస్ కాలనీలోని రామాలయమునందు శివరాత్రి సందర్భముగ అఖండ రుద్రాభిషేకములను నిర్వహింపజేయుచున్న వేళలలో ఆనాడు తిక్కన గారికి దర్శనమిచ్చిన హరిహరనాథుడు నేడు మరల ఇచట సాక్షాత్కరించినాడుకదా అనిపించెడిది. ఈ విధముగ వారు శైవ,వైష్ణవ సంప్రదాయములనడుమ చక్కని సమన్వయము సాధించి పెట్టుటయేగాక వేద భాగమైన రుద్రనమకమునకు రుద్రసూక్తమను పేరు రహస్యప్రకాశ రూపమైన వ్యాఖ్యానమును కూడ రచించి మానవజాతికి మధురమైన కానుకగ అందించినారు.

శ్రీ కృష్ణమాచార్య సంకల్పమునుండి ఉద్భవించి, వారి ప్రణాళికను నిర్వహించుటయే ధ్యేయముగ పనిచేయుచున్న సంస్థలలో మానవధర్మ శిక్షణ సంస్థ ఒకటి. వారుద్దేశించిన కార్యక్రమములను నేటికాలమునకు అనుగుణముగ క్రమబద్ధముచేసి, పెద్దఎత్తున నిర్వహించుట యందు శ్రద్ధపెట్టుచున్నది ఈ సంస్థ. వేద విద్యకు సంబంధించి శిక్షణ తరగతులను సంస్థ ప్రత్యేకముగ రూపొందించినది. పురుషసూక్త, శ్రీసూక్తములను నేర్పుట పూజావిధానమునందు శిక్షణనిచ్చుట, నమక, చమక మంత్రపుష్పములను నేర్పుట, రుద్రాభిషేక విధానమునందు శిక్షణనిచ్చుట అనునవి వేదవిద్య జూనియర్ శిక్షణ తరగతులకు పాఠ్య ప్రణాళికగ రూపొందినవి. ఈ గ్రంథము జూనియర్ విద్యార్థులకు కావలసిన పాఠ్యాంశములను తనలో ఇముడ్చుకొని వెలువడుట ఒక విశేషము.

గ్రంథమున వేదభాగములు ఎచ్చట వచ్చినను, వానిని స్వర యుక్తముగ ప్రచురించు ప్రయత్నము జరిగినది. రుద్రాభిషేక విధానమును కూర్పుచేయునపుడు రుద్రసంబంధమైన స్తోత్రములలో ప్రధానమైనవాని నన్నింటిని కూర్పుచేసి అందించుట జరిగినది. ఇట్లు కూర్పుచేసి అందించుటలో శ్రద్ధవహించినవారు బ్రహ్మశ్రీ శంకరశాస్త్రిగారు. స్వరము తప్పకుండ ముద్రణ జరుగుటలో శ్రద్ధ వహించినవారు వేద విదులు, మరియు తిరుమలా ఆర్టుప్రింటర్స్ అధినేతలు అయిన బ్రహ్మశ్రీ ఆకెళ్ళరామంగారు. వీరిరువురికీ మాస్టరుగారు పరిపూర్ణ జీవితమును అనుగ్రహింతురుగాక.

ఈ దివ్యగ్రంధము అందింపబడుచున్న వేళలో జాతినుద్దేశించి చెప్పుచున్నదేమనగా సోదరులారా! వేదము అనాది. అది మన పునాది. వేదము మన సంస్కృతికి ఇంకనూ చెప్పవలె నన్నచో మానవ సంస్కృతికి మూలము. వేదసారము నందించుటకే ఉపనిషత్తులు వెలిసినవి. వేద ప్రకారము మనను నడిపించుటకే ధర్మశాస్త్రములు తీర్చిదిద్దబడినవి. వేదసందేశమును మనకు తెలియజెప్పుటకే పురాణేతిహాసములు రచింపబడినవి, మన మెరిగిన సర్వసిద్ధాంతములకును, సకలసంప్రదాయములకును మూలము వేదమే. అట్టి మూలమును ఆశ్రయించి, నిత్య జీవితములను వెలిగించుకొనుట మన కర్తవ్యమైయున్నది. వేదమును విడిచి, ఎన్ని విద్యలు నేర్చినను మనము 'కుండీ మొక్కలు' గనే మిగిలిపోగలము. సకల విద్యలకును వేదము వేరువంటిది, ఆ వేరును విడిచి వేరుగ చదివినచో మన కృషి నిష్ఫలము కాగలదు. ఇది

సత్యము. కనుక వేదవిద్యతో మరల మన విద్యావిధానము ప్రారంభింపబడుగాక ! గృహస్థులు తగు మాత్రముగ వేదమును నేర్చుకొని, తమ తమ గృహములను గృహస్థాశ్రమములుగా తీర్చి దిద్దుకొందురు గాక ! వేదము మనకు కావలసిన శిక్షణ నందించగలదు. రక్షణ ననుగ్రహించగలదు. ఇహమునందు సమృద్ధినిచ్చి, పరమునందు సంతృప్తిని అనుభవింపజేయగలదు. అట్టి వేదమయమైన పరిపూర్ణ జీవితమునకు మనము నోచుకొందుముగాక ! ఈ శుభవేళ ఇదే 'నా' శుభాశంసనము.

3-10-89
దేవీనవరాత్రములు.
విజయవాడ-2.

మోపిదేవి కృష్ణస్వామి



# మానవధర్మ శిక్షణ సంస్థ (రిజిష్టర్డు)

## E. K. ⊙ C. V. V.

## ప్రార్థన

ఓం కారమును 3 పర్యాయము లుచ్చరించవలెను.

"గురుర్బ్రహ్మ ః గురుర్విష్ణుః ః గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరబ్రహ్మ ః తస్మై శ్రీ గురవేనమః

నమస్కారమ్స్ మాస్టర్
నమస్కారమ్స్ మాస్టర్ ఎం. కె.
నమస్కారమ్స్ మాస్టర్ ఇ, కె.
నమస్కారమ్స్ మాస్టర్ ఎమ్. యన్.
నమస్కారమ్స్ మాస్టర్ సి. వి. వి,
నమస్కారమ్స్ మాస్టర్ సి. వి. వి.
నమస్కారమ్స్ మాస్టర్ సి.వి.వి టుయువర్ లోటస్‌ఫీట్"
5 నిముషములు నిశ్శబ్దముగా ఉండవలయును,

"ఓం భూ ర్భువస్సువః ః ఓం తత్స వితుర్వరేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి ః ధియో యోనః ప్రచోదయాత్ ః"

5 నిముషములు నిశ్శబ్దముగా ఉండవలయును,

హరిః ఓం

"శం నో మిత్రశ్శం వరుణః ః శం నో భవత్వర్యమా ః
శంన ఇంద్రో బృహస్పతిః ః శంనో విష్ణు రురుక్రమః,

నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।

త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం వదిష్యామి।

సత్యం వదిష్యామి। తన్మా మవతు। తద్వక్తార మవతు

అవతు మామ్। అవతు వక్తారమ్। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

[ ఉదయము చెప్పవలసిన ఆశంసన వచనములు ]

From the point of Light, with in the Mind of God.
Let Light stream forth, into the minds of men.
Let light descend on Earth.
From the point of Love, with in the Heart of God,
Let Love stream forth, into the hearts of men.
May Christ return to Earth.
From the centre, where the will of God is Known.
Let purpose guide rhe little wills of men.
The Purpose, which the Masters know and serve,
From the centre, which we call the race of men.
Let the plan of Love and Light work out,
And may it seal the door, where evildwells.
From the Avatar of synthesis, who is to come.
Let his energy, pour down in all kingdoms.
May He lift up the Earth, to the Kings of Beauty.
Let Light, and Love and power, restore the plan on Earth

[ సాయంత్రము చెప్పవలసిన ఆశంసన వచనములు ]

May the Light in me, be the Light before me,
May I learn to see it in all.

May the sound I utter, reveal the Light in me,
May I listen to it, while others speak,
May the silence, in and around me, present itself,
The silence, which we break, every moment,
May it fill the darkness, of noise we do,
And convert it, into the Light of, our background'
Let virtue be the strength of my intelligence,
Let realization be, my attainment,
Let my purpose shape in to the purpose to our earth,
Let my plan be, an epitome of the Divine Plan,
May we speak the silence, with out breaking it'
May we live, in the awareness of the background,
May we transact light, in terms of joy,
May we be worthy, to find place in the

Eternal Kingdom OM

పిమ్మట ఈ క్రింది గురుస్తుతి (లేక వారి వారి ఇష్టదైవ ధ్యానము) చేయవలెను.

ఎక్కారాం కులాంభోధి విధు మానందరూపిణమ్
అనంతార్యతనూజాతం, కృష్ణం వందే జగద్గురుమ్
శ్రీకృష్ణమాచార్యమనంతపుత్రమ్,సత్సాధుమిత్రంకరుణార్ద్రనేత్రమ్
గురుం గురూణాం పితరం పితౄణాం, అనన్యశేషశ్శరణం ప్రపద్యే॥ 3

## మైత్రేయ స్తోత్రము

జగద్గురో నమస్తుభ్యం, హిమాలయ నివాసినే ।
నమస్తే దివ్యదేహాయ, మైత్రేయాయ నమోనమః ।
నమోప్రేమ స్వరూపాయ, మాయామోహ విదారిణే ।
నిర్మలాయ ప్రశాంతాయ, మైత్రేయాయ నమోనమః ॥

నమస్తే బోధిసత్వాయ, నమస్తే పుణ్య మూర్తయే।
పూర్ణానంద స్వరూపాయ, మైత్రేయాయ నమోనమః।
సిద్ధి బుద్ధి ప్రయుక్తాయ, సిద్ధి బుద్ధి ప్రదాయినే।
భవభీతి వినాశాయ, మైత్రేయాయ నమోనమః।
నమస్తే కర్మనిష్ఠాయ, యోగినాం పతయే నమః।
బ్రహ్మ జ్ఞాన స్వరూపాయ, మైత్రేయాయ నమోనమః।
నమస్తే గురుదేవాయ, నమస్తే ధర్మ సేతవే।
నారాయణ నియుక్తాయ, మైత్రేయాయ నమోనమః।
నమస్తే కరుణాసింధో, ప్రేమ పీయూష వర్షిణే।
జగద్బంధో నమస్తుభ్యం, మైత్రేయాయ నమోనమః।
మైత్రేయాయనమోనమః, మైత్రేయాయ నమోనమః

"లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥"

మానవధర్మ శిక్షణ సంస్థ
D. No. 23-10-7, పురుషోత్తం వీధి,
సత్యనారాయణపురం, విజయవాడ-11.

# శ్రీ గురుపాదుకా స్తోత్రము

శ్రీ సమంచిత మవ్యయం పరమ ప్రకాశ మగోచరం
భేదవర్జిత మప్రమేయ మనంత మాద్య మకల్మషం
నిర్మలం నిగమాంత మద్వయ మప్రతర్క్య మబోధకం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 1

నాదబిందు కళాత్మకం దశనాదభేద వినోదకం
మంత్రరాజ విరాజితం నిజమండలాంతర్భాసితం
పంచవర్ణ మఖండ మద్భుత మాదికారణ మచ్యుతం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 2

వ్యోమవత్ బహిరంతరస్థిత మక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిశుద్ధ మేకమజన్మహి ప్రతిరూపకం
బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతాను మోక్ష సుబోధకం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 3

బుద్ధిరూప మబుద్ధికం త్రితయైకకూట నివాసనం
నిశ్చలం నిరత పకాశక నిర్మలం నిజమూలకం
పశ్చిమాంతర ఖేలనం నిజశుద్ధ సంయమి గోచరం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 4

హృద్గతం విమలం మనోజ్ఞ విభాసితం పరమాణుకం
నీలమధ్య సునీల సన్నిభ మాదిబిందు నిజాంశుకం
సూక్ష్మకర్ణిక మధ్యమస్థిత విద్యుదాది విభాసితం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 5

పంచ పంచ హృషీక దేహ మనశ్చతుష్క పరస్పరం
పంచ భూత సకామషట్క సమీర శబ్ద ముఖేతరం
పంచకోశ గుణత్రయాది సమస్తధర్మ విలక్షణం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 6

పంచ ముద్ర సులక్ష్య దర్శన భావమాత్ర నిరూపణం
విద్యుదాది ధగద్ధగిత్వ రుచిర్వినోద వివర్ధనం
చిన్మఖాంతర వర్తనం విలసద్విలాస మమాయికం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 7

పంచవర్ణ సుచిర్విచిత్ర విశుద్ధ తత్త్వ విచారణం
చంద్ర సూర్య చిదగ్ని మండల మండితం ఘన చిన్మయం
చిత్కళా పరిపూర్ణ మంతర చిత్సమాధి నిరీక్షణం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 8

హంసచారమఖండ నాద మనేక వర్ణ మరూపకం
శబ్దజాల మయం చరాచర జంతుదేహ నివాసినం
చక్రరాజ మనాహతోద్భవ మేకవర్ణమతఃపరం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 9

జన్మకర్మ విలీనకారణ హేతుభూత మభూతకం
జన్మకర్మ నివారకం రుచిపూరకం భవతారకం
నామరూప వివర్జితం నిజనాయకం శుభదాయకం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ 10

త ప్త కాంచన దీప్యమాన మహాణుఛత్ర మరూపకం
చంద్రికాంతర తారకైరవ ముజ్వలం పరమాస్పదం
నీలనీరద మధ్యమస్థిత విద్యుదాది విభాసితం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 11

స్థూలసూక్ష్మ సకారణాంతర ఖేలనం పరిపాలనమ్
విశ్వతేజస ప్రాజ్ఞచేత సమంతరాత్మ నిజాంశుకం
సర్వకారణ మీశ్వరం నిటలాంతరాళ విహారకం
ప్రాతరేవహి మానసాంత ర్భావయే గురుపాదుకామ్ ॥ 12



## నిత్యదేవతార్చన, షోడశోపచారపూజా విధానము

(మూడుమారులు తీర్థముతో ఆచమనము చేసి ఇట్లు చదువుకొనవలెను.)

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా గోవిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

[తరువాత పుట్టను నీరు జల్లుచు ఈ మంత్రము చదువవలెను.]

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యే తే భూమి భారకాః ।
యే తేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

( సంకల్పము )

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ

పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, (ఇక్కడ ఏ రెండు నదుల మధ్యలో నున్నామో ఆ రెండు నదుల పేర్లు చెప్పవలెను)... మధ్యదేశే, మమ శోభనగృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన... ...నామ సంవత్సరే... ... అయనే... ఋతౌ... మాసే... పక్షే... తిధౌ... వాసరే*... శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్...గోత్రోద్భవః....శర్మ నామధేయః, ధర్మపత్నీ సమేతః, శ్రీమతః, ...గోత్రస్య... నామధేయస్య ... ధర్మపత్నీ సమేతస్య... మమ ఉపాత్త సమస్త దురితక్షయద్వారా, శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం, శ్రీ లక్ష్మీనారాయణ దేవతా ముద్దిశ్య గాయత్రీ జప(హోమ) సహిత షోడశోపచార పూజాం కరిష్యే. (నీటిని ఉంగరపు వ్రేలితో స్పృశింపవలెను.)

(* వాసరే అని ఉన్నచోట ఆ రోజు ఏ వారమో చూచుకొని ఆ వారము పేరు ఈ క్రింద వ్రాయబడినట్లుగ చెప్పవలెను.)

ఆదివారము — భాను వాసరే
సోమవారము — ఇందు వాసరే
మంగళవారము — భౌమ వాసరే

బుధవారము — సౌమ్య వాసరే
గురువారము — బృహస్పతి వాసరే
శుక్రవారము — భృగు వాసరే
శనివారము — స్థిర వాసరే

(తరువాత మూడుమారులు గాయత్రి మంత్రము చదువుతూ చేతి లోనికి నీరు తీసుకొని మంత్రము చదువుట పూర్తి అయిన తర్వాత తర్పణముగా విడువవలెను. తదుపరి ఈ క్రింది మంత్రములతో నాలుగు మారులు తర్పణము చేయవలెను.)

సంధ్యాం తర్పయామి, గాయత్రీం తర్పయామి,
బ్రాహ్మీం తర్పయామి, నిమృజీం తర్పయామి.

[ఇప్పుడు మూడుమారులు ఓంకారము చేసి, నమస్కరించి
ఈ క్రింది మంత్రము జపించవలెను.]

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా, బ్రహ్మ ఇత్యార్షం గాయత్రం ఛందం పరమాత్మం సరూపం, సాయుజ్యం వినియోగమ్ ఆయాతు వరదా దేవి అక్షరం బ్రహ్మ సమ్మితమ్. గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వమే, యదహ్నాత్కురుతే పాపం తదహ్నా త్ప్రతి ముచ్యతే యద్రాత్రాత్ కురుతే పాపం తద్రాత్ర్యాత్ ప్రతి ముచ్యతే. సర్వవర్ణే మహాదేవి సంధ్యావిద్యే సరస్వతి, ఓం ఓజోఽసి సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాంధామ

నామాసి, విశ్వమసి, విశ్వాయు, స్సర్వమసి, సర్వాయుః, అభిభూః ఓం, గాయత్రీ మావాహయామి, సావిత్రీ మావాహయామి, సరస్వతీ మావాహయామి, ఛందర్షీ న్నావాహయామి శ్రియ మావాహయామి, బలమా వాహయామి, గాయత్ర్యా గాయత్రీ ఛందో విశ్వామిత్ర ఋషిః, సవితా దేవతా, అగ్ని ర్ముఖం బ్రహ్మాశిరో. విష్ణుర్హృదయగ్ంం, రుద్రశ్శిఖా, పృథివీ యోనిః, ప్రాణాపాన వ్యానోదాన సమానాప్రాణా శ్వేత వర్ణా సాంఖ్యాయన సగోత్రా గాయత్రీ చతుర్వింగ్ంశత్యక్షరా త్రిపదాషట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః.

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యమ్, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ । ఓ మాపో జ్యోతీరసోஉమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

(తరువాత ఈ క్రింది శ్లోకములు చదువుచు ధ్యానము చేయవలెను.)

ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణై ర్యుక్తా మిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాంకుశకశా శ్శుభ్రం కపాలం గదాం శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే ।

ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తి
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటి
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః॥

గురుర్ బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః॥

నమస్కారమ్స్ మాస్టర్.
నమస్కారమ్స్ మాస్టర్ ఇ. కె.
నమస్కారమ్స్ మాస్టర్ ఎమ్. ఎన్.
నమస్కారమ్స్ మాస్టర్ సి. వి. వి.
నమస్కారమ్స్ మాస్టర్ సి. వి. వి.
నమస్కారమ్స్ మాస్టర్ సి. వి వి. టు యువర్ లోటస్ ఫీట్.

(గురుధ్యానము చేసి గాయత్రీమంత్రజపముపదిమారులు చేయవలెను.)

ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితు ర్వరేణ్యం,
భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్.

[ఈ దిగువ మంత్రములను పారాయణ చేయవలెను]

—

## [ఆదిత్యహృదయమ్]

తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితం ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణం ।
ఉపాగమ్యా బ్రవీ ద్రామ మగస్త్యో భగవా నృషిః॥

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్ ।
యేన సర్వా నరీ న్వత్స సమరే విజయిష్యసి ॥

ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం ।
జయావహం జపే న్నిత్య మక్షయ్యం పరమం శుభమ్ ॥

సర్వమంగళ మాంగళ్యం సర్వపాప ప్రణాశనం ।
చింతాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్।

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥

సర్వ దేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥

ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః ॥

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః ।
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః॥

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః ॥
హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తి ర్మరీచిమాన్ ।
తిమిరోన్మథనః శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥
హిరణ్యగర్భః శిశిర స్తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖః శిశిరనాశనః ॥
వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుః సామపారగః ।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః ॥
ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః ।
కవి ర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః ॥
నక్షత్ర గ్రహ తారాణా మధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మన్ నమోస్తు తే ॥
నమః పూర్వాయ గిరయే పశ్చిమా యాద్రయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయేనమః ॥
జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః ॥
నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః ॥
బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యా యాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నా యామితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥

తప్త చామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమస్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ॥

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః ॥

ఏన మాపత్సుకృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ ॥

పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిం ।
ఏత త్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।
ఏవ ముక్త్వా తదాఽగస్త్యో జగామ చ యథాగతమ్ ॥

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥
అథ రవిరవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచ స్త్వరేతి ।

ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో
నిదహాతి వేదః। స నః పర్ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం
దురితాత్యగ్నిః ।

## ( పురుష సూక్తం )

ఓం తచ్ఛంయో రావృణీమహే । గాతుం యజ్ఞాయ।
గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తి రస్తు నః। స్వస్తి ర్మాను
షేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శంనో అస్తు ద్విపదే।
శం చతుష్పదే। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ।

సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షః సహస్రపాత్ ।

స భూమిం విశ్వతో వృత్వా। అత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥

పురుష ఏ వేదగ్ం సర్వమ్ । యద్భూతం యచ్చ భవ్యమ్।

ఉతామృతత్వ స్యేశానః । యదన్నేనాతిరోహతి॥

ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।

పాదోఽస్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతందివి॥

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోస్యేహా భవాత్పునః।

తతో విష్వఙ్వ్యక్రామత్ । సాశనానశనే అభి॥

తస్మాద్విరాడజాయత । విరాజో అధి పూరుషః॥

సజాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమి మథోపురః॥

యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞ మతన్వత।

వసంతో అస్యాసీ దాజ్యమ్ । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥

సప్తాస్యాసన్ పరిధయః । త్రిస్సప్త సమిధః కృతాః।

దేవా యద్యజ్ఞం తన్వానాః । అబధ్నన్ పురుషం పశుమ్॥

తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ । పురుషం జాతమగ్రతః

తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చ యే

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్

పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్గ్రామ్యాశ్చ యే

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచస్సామాని జజ్ఞిరే

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ । యజుస్తస్మాదజాయత

తస్మాదశ్వా అజాయంత । యే కే చోభయాదతః

గావో హ జజ్ఞిరే తస్మాత్ । తస్మాజ్జాతా అజావయః

యత్పురుషం వ్యదధుః । కతిధా వ్యకల్పయన్

ముఖం కిమస్య కౌ బాహూ । కావూరూ పాదా వుచ్యేతే

బ్రాహ్మణో౽స్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః

ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత

చంద్రమా మనసో జాతః । చక్షో స్సూర్యో అజాయత

ముఖా దింద్రశ్చాగ్నిశ్చ । ప్రాణా ద్వాయు రజాయత

నాభ్యా ఆసీ దంతరిక్షం । శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత

పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్

వేదాహ మేతం పురుషం మహాంతమ్

ఆదిత్యవర్ణం తమసస్తు పారే

సర్వాణి రూపాణి విచిత్య ధీరః

నామాని కృత్వా౽భివదన్ యదాస్తే ॥

ధాతా పురస్తా ద్యముదా జహార ॥

శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః

తమేవం విద్వానమృత ఇహ భవతి

నాన్యః పంథా అయనాయ విద్యతే॥

యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః

తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।

తేహ నాకం మహిమానస్సచంతే

యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః॥

* * *

అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ

విశ్వకర్మణస్సమవర్తతాధి

తస్య త్వష్టా విదధద్రూపమేతి

తత్పురుషస్య విశ్వమాజానమగ్రే॥

వేదాహ మేతం పురుషం మహాంతమ్

ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్

తమేవం విద్వానమృత ఇహ భవతి

నాన్యః పంథా అయనాయ విద్యతే।

ప్రజాపతి శ్చరతి గర్భే అంతః

అజాయమానో బహుధా విజాయతే

తస్యధీరాః పరిజానంతి యోనిమ్

మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః

యో దేవేభ్య ఆతపతిః । యో దేవానాం పురోహితః

పూర్వో యో దేవేభ్యోజాతఃనమో రుచాయ బ్రాహ్మయే

రుచం బ్రాహ్మం జనయంతః । దేవా అగ్రే తదబ్రువన్

యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ । తస్య దేవా అసన్ వశే॥

శ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ

అహోరాత్రే పార్శ్వే । నక్షత్రాణి రూపమ్

అశ్వినౌ వ్యాత్తమ్ । ఇష్టం మనిషాణ

అముం మనిషాణ । సర్వం మనిషాణ ॥

ఓం తచ్ఛంయో రావృణీమహే ।

గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే॥

దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః

ఊర్ధ్వం జిగాతు భేషజం । శం నో అస్తు ద్విపదే

శం చతుష్పదే॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

# శ్రీసూక్తం

హరిః ఓమ్

హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజామ్ ।

చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।

యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్ ।

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।

శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్ ।

కాంసోస్మితాం హిరణ్యప్రాకారా

మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్ ।

పద్మేస్థితాం పద్మవర్ణాం

తామిహోపహ్వయే శ్రియమ్ ।

చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం

శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।

తాం పద్మినీమీం శరణమహం

ప్రపద్యే ఽలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ।

ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో

వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః ।

తస్య ఫలాని తపసా నుదంతు

మాయాంతరాయాశ్చ బాహ్యాఽలక్ష్మీః ।

ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ

ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే।

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీర్నాశయా మ్యహమ్।

అభూతి మసమృద్ధిం చ సర్వాన్నిర్ణుద మే గృహాత్ ।

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।

ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥

మనసః కామ మాకూతిం వాచః సత్య మశీమహి ।

పశూనాగ్ం రూప మన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః

కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।

శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥

ఆప స్స్రజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।

ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీమ్ ।

చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।

సూర్యాం హిరణ్మయీంలక్ష్మీంజాతవేదో మమావహ ॥

తాంమ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।

యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్

విందేయం పురుషానహమ్ ॥



1. ఆవాహనము :—

సహస్రశీర్‌షా పురుషః । సహస్రాక్ష స్సహస్రపాత్ ।

స భూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠ ద్దశాంగులమ్॥

శ్లో॥ జ్యోతి శ్శాంతం సర్వలోకాంతరస్థం
ఓంకారాఖ్యం యోగిహృద్ధ్యానగమ్యమ్ ।
సాంగం శక్తిం సాయుధం భక్త సేవ్యం
సర్వాకారం విష్ణు మావాహ యామి॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః ఆవాహయామి ।

2. ఆసనము :—

పురుష ఏ వేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం,

ఉతామృతత్వ స్యేశానః । యద న్నే నాతి రోహతి.

శ్లో॥ కల్పద్రుమూలే మణివేదిమధ్యే
సింహాసనం స్వర్ణమయం సురత్నమ్
విచిత్రవస్త్రావృత మచ్యుత ! ప్రభో !
గృహాణలక్ష్మీధరణీ సమన్విత॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః । ఆసనం సమర్పయామి। (అక్షత లుంచవలెను)

3. పాద్యము :—

ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।

పాదోఽస్య విశ్వా భూతాని । త్రిపాదస్యామృతం దివి ॥

శ్లో॥ గంగాజలం సమానీతం సుగంధ ద్రవ్య సంయుతమ్ ।
పాద్యం త్వం ప్రతిగృహ్ణీష్వ దేవ దేవ ! నమోఽస్తుతే ॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః॥ పాదయోః పాద్యం సమర్పయామి. (ఉదకమును ఉంచవలెను)

4. అర్ఘ్యం :—

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోఽస్యేహాభవాత్పునః ।

తతో విష్వఙ్వ్యక్రామత్ । సాశనానశనే అభి ॥

శ్లో॥ ధర్మస్వరూప ! ధర్మజ్ఞ । తులసీదామభూషణ
కంబుగ్రీవ ! మయా దత్తం గృహాణార్ఘ్యం నమోఽస్తుతే ॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః హస్తయో రర్ఘ్యం సమర్పయామి. (ఉదకము నుంచవలెను)

5. ఆచమనీయము :—

తస్మాద్విరాడజాయత । విరాజో అధిపూరుషః ॥

సజాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమి మథోపురః ॥

శ్లో॥ కర్పూరవాసితం తోయం సువర్ణ కలశస్థితమ్
దదా మ్యాచమనం భక్త్యా దేవ దేవః నమోఽస్తుతే॥

శ్రీలక్ష్మీనారాయణాభ్యాంనమఃఆచమనీయంసమర్పయామి.
(ఉదకము నుంచవలెను)

6. స్నానము :—

యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞ మతన్వత।

వసంతో అస్యాసీ దాజ్యమ్ । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥

శ్లో॥ తీర్థోదకైః కాంచనకుంభసంస్థైః
సువాసితై ర్దివ్యసుమంత్రపూతైః
మయార్పితం స్నాన మిదం గృహాణ
పాదాబ్జనిష్ఠ్యూత నదీ ప్రవాహః ॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః। స్నానం సమర్ప యామి, స్నానానంతర మాచమనీయం సమర్పయామి।

7. వస్త్రము :—

తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ । పురుషం జాతమగ్రతః

తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చయే

శ్లో॥ స్వర్ణాంచలం చిత్రవిచిత్రశోభితం
కౌశేయయుగ్మం పరికల్పితం మయా ।
దామోదర ప్రావరణం గృహాణ
మాయాచల ప్రాకృతదివ్యరూపః ॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః వస్త్రయుగ్మం సమర్పయామి. వస్త్రయుగ్మధారణానంతరమాచమనీయం సమర్పయామి.

8. యజ్ఞోపవీతం :—

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్

పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే

శ్లో॥ సువర్ణతంతూద్భవయజ్ఞ సూత్రం
ముక్తాఫలస్యూత మనేకరత్నమ్ ।
గృహాణ తద్వత్కృత ముత్తరీయం
స్వకర్మసూత్రంధర తే నమోఽస్తు॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః యజ్ఞోపవీతం సమర్పయామి. యజ్ఞోపవీతధారణానంతరమాచమనీయం సమర్పయామి.

9. గంధము :—

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచస్సామానిజజ్ఞిరే

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ । యజుస్తస్మాదజాయత

శ్లో॥ కస్తూరికాచందనకర్దమాని
కాశ్మీర సంయోజితగంధసారైః।
విలేపనం స్వీకురు దేవదేవ
శ్రీభూమివక్షోజవిలేపనార్హమ్॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః గంధం సమర్పయామి

10. పుష్పము :—

తస్మాదశ్వా అజాయంత। యే కే చోభయాదతః

గావో హ జజ్ఞిరే తస్మాత్। తస్మాజ్జాతా అజావయః

శ్లో॥ చామంతికావకుళచంపకపాటలాబ్జ
పున్నాగజాతికరవీర రసాలపుష్పైః
బిల్వప్రవాళతులసీదళమల్లికాభిః
త్వాం పూజయామి జగదీశ్వర ! వాసుదేవ !

శ్లో॥ ఆరామపుష్పాణి మనోహరాణి
జలాశయస్థాని సుపల్లవాని
సువర్ణ పుష్పాణి మయార్పితాని
గృహాణ శ్రీవత్సధర ! ప్రసీద !

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః పుష్పాణి సమర్పయామి.

శ్లో॥ కేయూరకటకే చైవ హస్తే చిత్రాంగుళీయకమ్।
మాణిక్యోల్లాసిమకుటం కుండలే హారశోభితమ్॥
నాభౌ నాయకరత్నం చ నూపురే హారపద్మయో।
అంగుళీముద్రికాశ్చైవ గృహ్యన్తా మస్మదర్పితాః॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః ఆభరణాని సమర్పయామి.

# లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రము

వందే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం।
హస్తాభ్యామభయప్రదాం మణిగణైర్నానావిధైర్భూషితాం
భక్తాభీష్ట ఫలప్రదాం హరిహర బ్రహ్మాదిభిః సేవితాం ।
పార్శ్వే పంకజ శంఖపద్మ నిధిభిర్యుక్తాం సదాశక్తిభిః ॥

సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుకగంధ మాల్యశోభే।
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీదమహ్యం॥

ఓం ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూత హితప్రదామ్ ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికాం ॥

వాచం పద్మాలయాం పద్మాంశుచిం స్వాహాంస్వధాంసుధాం
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥

అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్ ।
నమామి కమలాం కాంతాం కామాం క్షీరోదసంభవామ్ ॥

అనుగ్రహపరాం బుద్ధి మనఘాం హరివల్లభామ్ ।
అశోకా మమృతాం దీప్తాం లోకశోకవినాశినీమ్ ॥

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్ ।
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీమ్ ॥

పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభ ప్రియాం రమామ్ ।
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీమ్॥

పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్ ।
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్ర సహోదరీమ్ ॥

చతుర్భుజాం చంద్రరూపా మిందిరా మిందుశీతలామ్ ।
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీమ్ ॥
విమలాం విశ్వజననీం తుష్టిం దారిద్ర్యనాశినీమ్ ।
ప్రీతిపుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియమ్ ॥
భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్ ।
వసుంధరా ముదారాంగాం హరిణీం హేమమాలినీమ్ ॥
ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదామ్ ।
నృపవేశ్మ గతానందాం వరలక్ష్మీం వసుప్రదామ్ ॥
శుభాం హిరణ్య ప్రాకారాం సముద్రతనయాం జయామ్ ।
నమామి మంగళాం దేవీం విష్ణువక్షఃస్థల స్థితామ్ ॥
విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితామ్ ।
దారిద్ర్య ధ్వంసినీం, దేవీం సర్వోపద్రవ వారిణీం ॥
నవదుర్గాం మహాకాళీం బ్రహ్మ విష్ణు శివాత్మికామ్ ॥
త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీమ్ ॥
లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం ।
దాసీభూత సమస్త దేవవనితాం లోకైకదీపాంకురామ్ ॥
శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్ ॥

మాత ర్నమామి కమలే కమలాయతాక్షి
శ్రీవిష్ణుహృత్కమలవాసిని విశ్వమాతః ।
క్షీరోదజే కమలకోమల గర్భగౌరి
లక్ష్మి ప్రసీద సతతం నమతాం శరణ్యే ॥

# శ్రీ కృష్ణాష్టోత్తర శతనామస్తోత్రము

శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవః సనాతనః ।
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుష విగ్రహః ॥

శ్రీవత్స కౌస్తుభ ధరో యశోదావత్సలో హరిః ।
చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యుదాయుధః ॥

దేవకీ నందనః శ్రీశో నందగోప ప్రియాత్మజః ।
యమునా వేగ సంహారీ బలభద్ర ప్రియానుజః ॥

పూతనా జీవితహరః శకటాసుర భంజనః ।
నందవ్రజ జనానందీ సచ్చిదానంద విగ్రహః ॥

నవనీత విలిప్తాంగో నవనీతనటోఽనఘః ।
నవనీత నవాహారో ముచికుంద ప్రసాదకః ॥

షోడశస్త్రీ సహస్రేశః స్త్రిభంగీ మధురాకృతిః ।
శుకవాగమృతాబ్ధీందు ర్గోవిందో యోగినాం పతిః ॥

వత్సవాటచరోఽనంతో ధేనుకాసురభంజనః ।
తృణీకృత తృణావర్తో యమళార్జున భంజనః ॥

ఉత్తాల తాలభేత్తా చ తమాల శ్యామలాకృతిః ।
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్య సమప్రభః ॥

ఇళాపతిః పరంజ్యోతి ర్యాదవేంద్రో యదూద్వహః ।
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః ॥

గోవర్ధనాచలోద్ధర్తా గోపాలః సర్వపాలకః ।
అజో నిరంజనః కామజనకః కంజలోచనః ॥

మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ ।
బృందావనాంత సంచారీ తులసీదామ భూషణః ॥

స్యమంతక మణేర్హర్తా నరనారాయణాత్మకః ।
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః ॥

ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదః ।
సంసారవైరి కంసారి ర్మురారి ర్నరకాంతకః ॥

అనాది బ్రహ్మచారీ చ కృష్ణా వ్యసన కర్శకః ।
శిశుపాల శిరశ్ఛేత్తా దుర్యోధనకులాంతకః ॥

విదురాక్రూరవరదో విశ్వరూప ప్రదర్శకః ।
సత్యవా క్సత్యసంకల్పః సత్యభామారతో జయీ ॥

సుభద్రాపూర్వజో విష్ణు ర్భీష్మముక్తి ప్రదాయకః ।
జగద్గురు ర్జగన్నాథో వేణునాద విశారదః ॥

వృషభాసుర విధ్వంసీ బాణాసుర కరాంతకః ।
యుధిష్ఠిర ప్రతిష్ఠాతా బర్హి బర్హావతంసకః ॥

పార్థసారథి రవ్యక్తో గీతామృత మహోదధిః ।
కాళీయఫణిమాణిక్య రంజిత శ్రీపదాంబుజః ॥

దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్ర వినాశకః ।
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశన వాహనః ॥

జలక్రీడా సమాసక్త గోపీవస్త్రాపహారకః ।
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః ॥

సర్వతీర్థాత్మకః సర్వగ్రహరూపీ పరాత్పరః ।
ఏవం శ్రీకృష్ణ దేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్ ।
కృష్ణ నామామృతం నామ పరమానంద కారకమ్ ।
అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్య వర్ధనమ్ ।

[ఇదికాక భక్తులు యథాశక్తి స్తోత్రములు, సహస్ర నామములు, అష్టోత్తరములు కూడ చేసికొనవచ్చును.]

## నారాయణ కవచమ్

ఓం నమో నారాయణాయ । ఓం నమో భగవతే వాసుదేవాయ । విష్ణవే నమః । ఫట్ ఇత్యస్త్రాయ ఫట్ ।
భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః ॥

ఇత్యాత్మానాం పరం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభి ర్యుతమ్।
విద్యా తేజ స్తపోమూర్తి మిమం మంత్ర ముదాహరేత్ ।

ఓం హరి ర్విదధ్యా న్మమ సర్వరక్షాం
న్యస్తాంఘ్రి పద్మః పతగేంద్ర పృష్ఠే ।
దరారి చర్మాసి గ దేషు చాప
పాశాన్ దధానోఽష్టగుణోఽష్ట బాహుః ।

జలేషు మాం రక్షతు మత్స్య మూర్తి
ర్యాదో గణేభ్యో వరుణస్య పాశాత్ ।
స్థలేషు మాయావటు వామనోఽవ్యాత్
త్రివిక్రమః ఖేఽవతు విశ్వరూపః ॥

దుర్గేష్వటవ్యాజి ముఖాదిషు ప్రభుః
పాయా న్నృసింహోఽసురయూథపారిః ।
విముంచతో యస్య మహాట్టహాసం
దిశో వినేదు ర్న్యపతంశ్చ గర్భాః ।

రక్ష త్వసౌ మాఽధ్వని యజ్ఞ కల్పః
స్వదంష్ట్రయోన్నీతధరో వరాహః ।
రామోఽద్రికూటే ష్వథ విప్రవాసే
సలక్ష్మణోఽవ్యా ద్భరతాగ్రజో మామ్ ।

మాముగ్ర ధర్మా దఖిలా త్ప్రమాదా
న్నారాయణః పాతు నరశ్చ హాసాత్ ।
దత్తస్త్వయోగా దథ యోగనాథః
పాయా ద్గుణేశః కపిలః కర్మబంధనాత్ ।

సనత్కుమారోఽవతు కామదేవా
ద్ధయాస్యమూర్తిః పథి దేవ హేలనాత్ ।
దేవర్షి వర్యః పురుషార్చనాంతరాత్
కూర్మో హరి ర్మాం నిరయా దశేషాత్ ।

ధన్వంతరి ర్భగవాన్ పాత్వపథ్యా
ద్ద్వంద్వా ద్భయా దృషభో నిర్జితాత్మా ।
యజ్ఞశ్చ లోకాదవతా జ్జనాంతా
ద్బలో గణా త్క్రోధవశా దహీంద్ర ।

10)

ద్వైపాయనో భగవా నప్రబోధా
ద్బుద్ధస్తు పాషండగణా త్ప్రమాదాత్ ।
కల్కిః కలేః కాలమలా త్ప్రపాతు
ధర్మావనాయోరు కృతావతారః ॥

మాం కేశవో గదయా ప్రాతరవ్యా
ద్గోవింద ఆసంగవ మాత్తవేణుః ।
నారాయణః ప్రాహ్ణ ఉదాత్త శక్తి
ర్మధ్యందినే విష్ణు రరీంద్రపాణిః ॥

దేవోఽపరాహ్ణే మధుహోగ్ర ధన్వా
సాయం త్రిధామావతు మాధవో మామ్ ।
దోషే హృషీ కేశ ఉతార్ధ రాత్రే
నిశీథ ఏకోఽవతు పద్మనాభః ॥

శ్రీవత్సధామాఽపరరాత్ర ఈశః
ప్రత్యూష ఈశోఽసిధరో జనార్దనః ।
దామోదరోఽవ్యా దనుసంధ్యం ప్రభాతే
విశ్వేశ్వరో భగవాన్కాలమూర్తిః ॥

చక్రం యుగాంతానల తిగ్మనేమి
భ్రమ త్సమంతా ద్భగవత్ప్రయుక్తమ్ ।
దందగ్ధి దందగ్ధ్యరిసైన్య మాశు
కక్షం యథా వాతసఖో హుతాశః ॥

గదేఽశ నిష్పర్శన విస్ఫులింగే
నిష్పిండి నిష్పిం ద్విజిత ప్రియాసి ।
కూష్మాండ వైనాయక యక్షరక్షో
భూతగ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్ ॥

త్వం యాతుధాన ప్రమథ ప్రేత మాతృ
పిశాచ విప్రగ్రహ ఘోరదృష్టీన్ ।
దరేంద్ర విద్రావయ కృష్ణపూరితో
భీమస్వనోఽరేర్హృదయాని కంపయ ॥

త్వం తిగ్మధారాసి పరారిసైన్య
మీశప్రయుక్తో మమ ఛింధి ఛింధి ।
చక్షూంసి శర్మన్ శతచంద్ర ఛాదయ
ద్విషా మఘోనాం హర పాపచక్షుసామ్ ॥

యన్నోభయంగ్రహేభ్యోభూ త్కేతుభ్యో నృభ్య ఏవచ
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోఽఘేభ్య ఏవచ ।
సర్వాణ్యేతాని భగవన్నామ రూపాస్త్ర కీర్తనాత్
ప్రయాంతు సంక్షయం సద్యోయేఽన్యే శ్రేయః ప్రతీపకాః॥

గరుడో భగవాన్ స్తోత్ర స్తోభశ్ఛందోమయః ప్రభుః
రక్షత్వశేష కృచ్ఛ్రేభ్యో విష్వక్సేనస్య వాహనమ్ ।
సర్వాపద్భ్యో హరే ర్నామరూప యానాయుధాని నః
బుద్ధీంద్రియ మనః ప్రాణాన్ పాంతు పార్షదభూషణాః ॥

యథాహి భగవానేవ వస్తుతః సదసచ్చ యత్
సత్యే నానేన నః సర్వే యాంతు నాశ ముపద్రవాః ।
యథైకాత్మ్యానుభావానాం వికల్పరహితః స్వయమ్
భూషణాయుధ లింగాఖ్యాధత్తే శక్తీః స్వమాయయా ॥

తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః ।
పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః ॥

విదిక్షు దిక్షూర్ధ్వ మధః సమంతా
దంత ర్బహి ర్భగవా న్నారసింహః ।
ప్రహాపయ న్లోకభయం స్వనేన
స్వతేజసా గ్రస్త సమస్త తేజాః ॥

## మృత్యుంజయ మంత్రము

(దిగువ మంత్రమును మూడు మారులు చదువుచు శివలింగమును గాని, శంఖమును గాని అభిషేకించవలెను.)

ఓం త్రియంబకం యజామహే।సుగంధిం పుష్టివర్ధనమ్।

ఉర్వారుక మివ బంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్।

యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో

విశ్వాభువనా వివేశ తస్మై రుద్రాయ నమో అస్తు। ఓం

శాంతి శ్శాంతి శ్శాంతిః॥

## గణపతి మంత్రము

ఓం గణానాం త్వా గణపతిగ్ంం హవామహే। కవిం

కవీనా ముపమశ్రవ స్తమమ్। జ్యేష్ఠరాజం బ్రహ్మణాం

బ్రహ్మణస్పత ఆన శృణ్వ న్నూతిభిస్సీదసాదనమ్॥

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః॥ శ్రీ గురుభ్యోనమః॥

( గణపతి నర్చింపవలెను )

## దుర్గా మంత్రము

హరిః ఓం। తామగ్ని వర్ణాం తపసా జ్వలంతీం వైరో

చనీం కర్మ ఫలేషు జుష్టామ్। దుర్గాం దేవీగ్ంం శరణ మహం

ప్రపద్యే సుతరసితర సే నమః॥

ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిద హాతి వేదః । సనః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః ॥

( దుర్గ నర్చింపవలెను )

## సరస్వతీ, లక్ష్మి మంత్రములు

ఓం ప్రణో దేవీ సరస్వతీ । వాజేభి ర్వాజినీవతీ। ధీనా మవి త్ర్యవతు ॥ మహాదేవ్యైచ విద్మహే విష్ణు పత్న్యైచ ధీమహి। తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

## ప్రత్యంగిరా మంత్రము

(నీటిని పైకి జల్లుచు ఈ మంత్రమును మూడుమార్లు జపించవలెను)

యాం కల్పయంతి నోఽరయః క్రూరాం కృత్యాం వధూమివ।
తాం బ్రహ్మణాపనిర్ణుద్మః ప్రత్యక్ కర్తార మృచ్ఛతు ॥

## లలితా స్తుతి

అవిద్యానా మంత స్తిమిర మిహిర ద్వీప నగరీ
జడానాం చైతన్య స్తబక మకరంద స్రుతిఝరీ ।

దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా ముररిపు వరాహస్య భవతీ ॥

శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం
వరత్రాస త్రాణ స్ఫటిక ఘుటికా పుస్తక కరామ్ ।
సకృన్నత్వా నత్వా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీర ద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః ॥

శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి ।
అతస్త్వా మారాధ్యే హరిహర విరించ్యాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృత పుణ్యః ప్రభవతి॥

(అగరువత్తులు వెలిగించి ధూపము చూపి ఈ మంత్రము చదువవలెను)

యత్పురుషం వ్యదధుః । కతిధా వ్యకల్పయన్ ।

ముఖంకిమస్య కౌ బాహూ । కావూరూ పాదా వుచ్యేతే ॥

వనస్పతి రసై ర్దివ్యై ర్నానాగంధై స్సుసంయుతమ్।
ఆఘ్రేయం సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః। ధూప మాఘ్రాపయామి॥

( దీపమును చూపుచు ఈ క్రింది మంత్రమును చదువ వలెను. )

బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః।

ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా। గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్। భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే। త్రాహి మాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోఽస్తుతే।

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః సాక్షాద్దీపం దర్శయామి । ధూప దీపానంతరం ఆచమనీయం సమర్పయామి ॥

( నైవేద్యము సమర్పించుచు ఈ మంత్రము చదువవలెను )

చంద్రమా మనసోజాతః । చక్షోస్సూర్యో అజాయత ।

ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ॥

ఓం భూర్భువస్సువః । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ।

అమృతమస్తు । అమృతోపస్తరణమసి । ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా। ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా । మధ్యే మధ్యే పానీయం సమర్పయామి । ఓం బ్రహ్మణేనమః । సర్వేభ్యో దేవేభ్యో నమః, అమృతాభిధానమసి । ఉత్తరాపోశనం సమర్పయామి । హస్తౌ ప్రక్షాళయామి । పాదౌ ప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।

